# లాచిత్ బడ్‌ఫుకాన్

రచన

మధుకర్ లిమయే

అనువాదం

ఐతా చంద్రయ్య

ప్రధాన సంపాదకులు

(మూల రచన)

యల్.యస్. శేషగిరిరావు


**భారత భారతి పుస్తకమాల**

(తెలుగు సంస్కరణ)

3-4-852, కేశవనిలయం

బరకత్‌పురా, హైదరాబాద్ - 500 029

ప్రచురణ కర్తలు :

నవయుగ భారతి ప్రచురణలు

పోస్టుబాక్సు నెం. 1041, నారాయణగూడ, హైదరాబాదు - 29

తెలుగు సంస్కరణ సంపాదకులు :

టి. హరిహర శర్మ

ప్రథమ ముద్రణ :

జూలై 1997

వెల : రూ. 6.00

ప్రతులకు :

సాహిత్య నికేతన్

3-4-852, కేశవనిలయం

బర్కత్‌పురా, హైదరాబాదు - 500 027

ఫోన్ : 760 3236

# ఇది మామాట

**కే**వలం భారత దేశంలోనే కాక, మొత్తం ప్రపంచంలోనే ప్రఖ్యాతులైన మన పూర్వీకులను స్మరించడం, వారి జీవితాలను అధ్యయనం చేయడం ఎల్లప్పుడూ ప్రేరణ దాయకంగాను, మార్గదర్శకంగాను ఉండగలదన డంలో సందేహం లేదు.

మన చరిత్రకే వన్నె తెచ్చిన ఆ మహనీయుల జీవితాలను సరళమైన, ఉత్తేజకరమైన భాషలో ప్రజలకందించే చక్కని ప్రయత్నాన్ని రాష్ట్రోత్థాన పరిషత్, బెంగళూరు వారు ప్రారంభించారు.

'నవయుగభారతి' ఆ పుస్తకాలను తెలుగులోకి అనువదించే బృహత్కార్యాన్ని చేపట్టింది. భారత భారతి పుస్తకమాల రూపంలో మీ చేతుల్లో ఉన్న పుస్తకాలు ఆ ప్రయత్న ఫలితమే. మన చరిత్రలోని మహా పురుషుల జీవితాలు ఈ పుస్తకమాల ద్వారా మీ కందించబడతాయి.

అమరమైన, అనంతమైన మన గత చరిత్ర అనే అమృత స్రోతస్సును తరువాతి తరానికి అందించగలుగుతున్నామనే సంతృప్తితో ఈ పుస్తకాలను మీ ముందు పెడుతున్నాం. మీరు కూడా ఈ కృషిని ప్రశంసిం చగలరని, ప్రోత్సహించగలరని ఆశిస్తాను.

మూల రచనను సరళమైన, ఆహ్లాదకరమైన రీతిలో తెలుగులోకి అనువదించిన అనువాదకులకు ధన్యవాదాలు.

- **హరిహర శర్మ**, సంపాదకులు

# లాచిత్ బడ్ పుకన్

అస్సాం యువకుల నరాల్లో స్ఫూర్తి చైతన్యం పరుగులు తీయించిన మహాపురుషుడు లాచిత్ బడ్ పుకన్. విధి నిర్వహణలో బాధ్యతారహితంగా ప్రవర్తించిన పినతండ్రి తలనరికి రక్తసంబంధం కంటే దేశమే మిన్నయైనదని చాటిచెప్పిన ప్రఖర దేశభక్తుడు. అస్సాంను తమ అధీనంలోనికి రాబట్టాలని ప్రయత్నించిన మొగలు సేనల గుండెల్లో నిద్రపోయిన అస్సాం సేనాపతి.

కొనవూపిరి వున్నంతవరకూ తన మాతృ భూమి అస్సాంపై విధర్మీయుల ఆధిపత్యం మోపనీయకుండా అమరుడైన వాడు లాచిత్ బడ్‌పుకన్.

అస్సాం పేరు పత్రికల్లో తరచు కనబడుతూ ఉంటుంది. మన దేశంలో ఈశాన్యం వైపున అస్సాం ప్రదేశముంది. అందుకే ఇక్కడ జరిగిన ప్రతిసంఘటన ఉత్సుకత రేకెత్తిస్తుంది. దేశ సరిహద్దుల్లో ప్రహరీగోడలాగున్న అస్సాం ప్రాంతాలలో జరిగిన సంఘటనలన్నీ దేశం మొత్తంమీద ప్రభావం చూపుతాయి.

ప్రాంతాల వారీగా జరిగిన ఆందోళనల కారణంగా ఈ ప్రదేశాన్ని ఏడు రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలుగా విభజించారు. అవి అస్సాం, అరుణాచల్ ప్రదేశ్, మిజోరాం, త్రిపుర, మేఘాలయ, నాగాలాండ్ మరియు మణిపూర్.

వీటిలో అస్సాం రాష్ట్రానికి ప్రాచీన కాలం నుండి ఒక

ప్రత్యేకత ఉంది. అస్సాం రాజధాని గౌహతికి పన్నెండు కిలోమీటర్ల దూరములో వశిష్ఠ మహర్షి ఆశ్రమముంది. అస్సాం (కామరూప్)లోని ప్రాచీన నగరం గౌహతి. అనాడిది ప్రాగ్జ్యోతిషపురం అని పిలువబడేది. కామాఖ్య మందిరము, నవగ్రహ దేవాలయము, ఉమానంద మందిరము, భువనేశ్వరి దేవాలయము మన సాంస్కృతిక ఏకత్వానికి ప్రతీకలు.

మహాభారత కథలో కామరూప్ ప్రసక్తి ఉంది. ఆనాటి బలి చక్రవర్తి రాజధాని తేజ్‌పూర్ ఈనాడు ఎంతో ప్రాముఖ్యత సంతరించుకుంది.

అస్సాం క్షేత్రం దుర్గమ ప్రదేశం. దాని గురించి నోటికథలెన్నో చెబుతుంటారు. అస్సాం ఇంద్రజాలికుల ఆటంకాలు గూడ ఈ సందర్భంగా గుర్తుకొస్తాయి.

భారతదేశాన్ని పరిపాలించిన మొగలాయి రాజులు

ఇక్కడి ప్రాముఖ్యతను గుర్తించి దీన్ని తమ పరిపాలనలోకి చేర్చుకోవాలని ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలురయ్యారు.

తేయాకు మరియు నూనెలకు ప్రసిద్ధిగాంచిన ఈ ప్రాంతానికి ఉత్తరాన టిబెట్ (ప్రస్తుతం టిబెట్ చైనా ఆధిపత్యంలో ఉంది) తూర్పున బ్రహ్మదేశము (బర్మా) మరియు దక్షిణాన బంగ్లాదేశ్‌లు ఎల్లలు. పదమూడవ శతాబ్దం వరకు ఇక్కడ అహోం రాజుల పరిపాలన కొనసాగింది. 1823 సంధి తర్వాత బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ ఆధీనంలోకొచ్చింది.

మహారాష్ట్రంలో ఛత్రపతి శివాజీ, రాజస్థాన్‌లో మహారాణా ప్రతాప్‌లాంటి వీరులవలె అస్సాం ప్రాంతములో లాచిత్‌బడ్‌ఫుకన్ పేరు ప్రఖ్యాతినొందింది. లాచిత్ పేరు వినగానే అస్సాం యువకుల నరాల్లో స్ఫూర్తి, చైతన్యం పరుగులు తీస్తాయి. మహాపురుషుడైన లాచిత్ బడ్‌ఫుకన్ జీవిత చరిత్ర ఇది.

# లాచిత్ బడ్‌ఫుకన్

ఎముకలు కొరికే చలికాలమది. తెల్లవారింది. కాని బాల భాస్కరుని సూర్యకిరణాలు భూమికి చేరలేదింకా. రాజస్థాన్ నుండి వచ్చి ఇక్కడి తోటమాలీలపైన పర్యవేక్షిస్తున్న మోమయితాములీ బర్బరువా ఎప్పటిలాగే ప్రాతఃకాలపు చల్లగాలిని గుండెలనిండా పీలుస్తూ ఆనందిస్తున్నాడు. తోటంతా ముత్యాల్లాంటి మంచు కణాలతో అలంకరింపబడింది.

అనుకోకుండా పసిబాలుని ఏడ్పు విన్పించింది. ఆశ్చర్యమేసింది. ఈ సమయంలో పసికూన నెవరు తీసుకొస్తారనే ఉత్కంఠ రేకెత్తింది. ఏడ్పు వినిపించిన దిక్కుగా నడిచాడు. ఒక చెట్టు క్రింద గుడ్డలతో చుట్టి ఉన్న ఆరుమాసాల పసివాడు కనిపించాడు. ఒళ్ళంతా రక్తంతో తడిసుంది. ఐనా జీవించే ఉన్నాడు. వెంటనే ఆ బాలుణ్ణి ఇంటికి తీసుకెళ్ళాడు.



గుక్కవట్టి ఏడుస్తున్న ఒక బాలుడు మోమయితాములి కంటవడ్డ

## రక్తసిక్త బాలుడు

మోమయితాములీకి సంతానం లేదు. దయతో భగవంతుడు ప్రసాదించాడని ఆ పసివాడిని స్వీకరించాడు. తానే పెంచుకోవాలని నిర్ణయించుకున్నాడు. అస్సామీ భాషలో ల, అంటే రక్తము, చిత్, అంటే తడిసి యున్న అని అర్థము. అందుకే బాలునికి లచిత్ అనే నామకరణం చేసి గుండెలకు హత్తుకున్నాడు. ఏ పరిస్థితుల్లో అలా నామకరణం జరిగిందో ఆ బాలుడికేం తెల్సు? కాని అదే బాలుడు పెరిగి వందలాది శత్రువుల రక్తంతో స్నానమాడాడు. ముందు కాలములో అతడు అస్సాం సేనాపతిగా ఎదిగాడు. రామసింహుని నేతృత్వంలోని మొగలు సేనలకు తన వీరత్వాన్ని రుచిచూపి అజేయుడయ్యాడు.

## మొగలాయిల నీచదృష్టి

కొన్ని శతాబ్దాల పాటు ముస్లిం దాడులకు గురైవారి పరిపాలనలో మగ్గిపోవడం మనదేశ దౌర్భాగ్యం. ఐనా

దేశంలోని కొన్ని భాగాలలో ముస్లిం పాలకుల దుష్టపాలనకు చోటు దొరకలేదనేది చరిత్ర చెప్పే వాస్తవం. అస్సాంపై మొగలాయిలెన్నోసార్లు దాడిచేసి శృంగభంగం చెందారు. అదే అస్సాం ఉజ్వల చరిత్రకు కారణమైంది. చరిత్రలో ఇది యవనాః క్షయం ఆయమః గా నిలిచి పోయింది. అనగా దురాక్రమణదారులు సర్వనాశనం చేయదలచుకుని విఫలులయ్యారని. ఉదాహరణకు - భక్తియార్ ఖిల్జీ సైన్య సమేతంగా ఢిల్లీ నుండి బయలుదేరాడు. మార్గమధ్యంలో హిందూ రాజ్యాలను జయించి బీహార్‌లోని నలందా విశ్వవిద్యాలయాన్ని ధ్వంసం చేసి రాక్షసానందం పొందాడు. బెంగాల్‌ను జయించి అస్సాంపై దాడి ప్రారంభించాడు. కాని ఉత్తర గౌహతి అతని సమాధిస్థలంగా మారింది. హిందూ దేవాలయాలను ధ్వంసం చేయడంలో ఆరితేరిన ఢాకా సేనాపతి కాలాపహాడ్ గూడా అస్సాంపై దండయాత్ర చేశాడు. కాని కేదార పర్వతశ్రేణుల సమీపంలోని హాజో వద్ద చంపబడ్డాడు.

1639లో మొగలు సేనాపతి అల్లాహ్ యార్‌ఖాన్ గూడా అస్సాంమీద దండయాత్ర చేశాడు. అప్పుడు అహోం రాజులు తమలో తామే కలహించుకుంటున్న కారణంగా అతడు పశ్చిమ అస్సాంలో సఫలీకృతుడైనాడు. అప్పటికే స్వయంశక్తితో సేనాపతి పదవినలంకరించిన మోమయితాములీ బర్బరువాతో సంధి కుదుర్చు కున్నాడు. దాంతో లాభం పొందాలని పట్టుబట్టిన జయధ్వజ సింహ రాజు పశ్చిమ అస్సాం నుండి మొగలులను తరిమేసి ఆ ప్రాంతాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు.

## మీర్ జుమ్లా

ఔరంగజేబు మొగల్ సింహాసన మధిష్ఠించిన తర్వాత మీర్ జుమ్లా అనే సేనాపతిని అస్సాం స్వాతంత్ర్యాన్ని కబళించేందుకు పంపించాడు. మీర్ జుమ్లా పెద్ద సైన్యంతో బయలుదేరి గౌహతి చేరుకున్నాడు. దేశద్రోహియైన అక్కడి సేనాపతికి లంచమిచ్చి రాజధాని

గార్గావ్‌లో ప్రవేశించాడు. అక్కడి రాజు పారిపోయి పర్వతాల వద్ద చరైదేత్ అరణ్యంలో ఉండిపోయాడు. 1662లో మీర్ జుమ్లా అస్సాంను జయించాడు కాని అక్కడి వాతావరణం అతని సైనికులకు సరిపోలేదు. ఎంతోకాలం ఉండలేకపోయాడు. అస్సాంలోని కుండపోత వర్షాలకు, దోమల వీరవిహారానికి తట్టుకోలేకపోయారు. ఆ అడవి ప్రదేశమంతా దోమలతో నిండి ఉండుటచే సైనికుల్లో మలేరియా వ్యాధి దావానలంలా వ్యాపించింది. 1663లో పశ్చిమ అస్సాం, అహోం రాజులతో సంధిచేసుకుని మొగలుల యుద్ధ నష్టాన్ని పూరించుకున్నాడు. యుద్ధం ఆగిపోయింది. అహోం రాకుమారిని మొగల్ రాజులకు కానుకగా తీసుకెళ్ళారు. ఆమెపేరు రోషనారాగా మార్చి ఔరంగజేబు కుమారునితో వివాహం చేశారు.సంధి షరతుల ప్రకారం అహోం రాజులు మొగల్ చక్రవర్తికి

లక్షల రూపాయల నష్టపరిహారం ప్రతి ఏటా చెల్లించాలి. అరవై ఏనుగులను గూడా పంపాలి. సంధి తర్వాత మీర్‌జుమ్లా ఢిల్లీకి ప్రయాణమై దారిలోనే మరణించాడు.

మోమయితాములీ పెంచిన బాలుడు యువకుడయ్యాడు. బలం అతని ఆస్తి, వీరత్వం భూషణమైంది. అతని జగజెట్టి తనం అహోం రాజు హృదయంలో స్థానం సంపాదించుకుంది. అతని సోదరి అనా మోమయితాములీ కూతురు అహోం రాజు భార్యయైంది. మీర్ జుమ్లా దురాక్రమణ జరిపినప్పుడు లాచిత్ నారాజాతి రాజుతో యుద్ధం చేస్తున్నాడు. మీర్ జుమ్లా అతణ్ణి వెంబడించాడు. తన మేనకోడల్ని విడిపించుకు రావాలనుకున్నాడు. కాని అప్పటికే జరగాల్సిందంతా జరిగిపోవుటచే వెనుదిరిగాడు.

ఈ సంఘటన వీరవరుడైన లాచిత్ గుండెల్లో ప్రతీకారాన్ని రగిలించింది.

## జయధ్వజుని రోషము

సంధి జయధ్వజ రాజుకు గూడా నచ్చలేదు. దేశ గౌరవాన్ని దించేసిన ఈ సంధి షరతుల నుల్లంఘించి సాధ్యమైనంత తొందరగా మొగలుల నెదుర్కోవాల నుకున్నాడు. కాని అతని ప్రధాన మంత్రి అతన్ బడగోహాయ్.

''ఒక బుద్ధిమంతుడైన వ్యక్తిని భయపెట్టించి ఈవిధంగా అడుగేయడం బాగుండదు. మొదట మనం సైన్యాలను సమకూర్చుకోవాలి. అప్పుడే మొగలులను మన మాతృభూమి నుండి తరిమివేయగలుగుతాం. ప్రస్తుతం మనవద్ద మందుగుండు సామాగ్రి లేదు. అంతేకాదు మన సైన్యంగూడా సంఘటితంగా లేదు. సైన్యం పూర్తిగా సంఘటిత మయేవరకు మన యాత్ర సఫలం కాదు. మొగలులను బయటికి పంపించలేవ వాస్తవ పరిస్థితులను వివరించాడు. అప్పు రోజు ఆగిపోవాల్సి వచ్చింది.

వస్త్రాలు

పారన్నాడు.

తర్వాత మెల్లమెల్లగా సైన్యాలను సమకూర్చుకుని సంఘటిత పరిచారు. కొద్ది రోజుల్లోనే సైన్యం పెద్ద సంఖ్యలో తయారైంది. అస్సాంలో నదిమీద ప్రయాణ మెక్కువగా ఉంటుంది. కాబట్టి జలసేన కూడా సిద్ధమైంది. యుద్ధంలో తమకు సహకరించాల్సిందిగా పక్కరాజ్యాలకు దూతల ద్వారా వర్తమానం ఇలా పంపించారు.

''మేము దురాక్రమణ దారులైన మొగలులనుండి మన మాతృభూమిని విముక్తి చేయదలిచాం. ఈ ధర్మ యుద్ధంలో మీరు మాకు సహకరించాలి''.

వెంటనే ఖాసియా రాజు, జయంతియారాజు, మరియు కఛారియా రాజు సహాయమందిస్తామని వాగ్దానం చేశారు. అహోం రాజు సైన్యాలను స్వయంగా పర్యవేక్షించాడు.

## జయధ్వజ సింహుని చివరి కోరిక

యుద్ధానికి ఏర్పాట్లు పూర్తైనాయి. కాని ఎక్కువగా

శ్రమించుటచేత జయధ్వజసింహ రాజు అనారోగ్యం పాలయాడు. మృత్యుశయ్యమీద దొర్లుతూ అతడు చక్రధ్వజసింహునితో ఇలాగన్నాడు.

''పశ్చిమ క్షేత్రం నుండి మొగలులను తరిమేయక పోయాననే వెలితి జీవితాంతం వరకు నాలో ఉంటుంది. ఈపని పూర్తయ్యే వరకు నా ఆత్మశాంతించదు.

తదుపరి వారసుడైన చక్రధ్వజసింహునికి మాతృభూమిపట్ల ప్రగాఢమైన ప్రేమ ఉంది. మాతృభూమికున్న కళంకాన్ని తుడిచితీరుతానని ప్రతిజ్ఞచేశాడు. జయధ్వజసింహ సంతోషంతో ప్రాణాలు వదిలాడు.

చక్రధ్వజసింహ రాజు అధికార పీఠాన్నలంకరించాడు. యుద్ధానికి ఏర్పాట్లు పూర్తయ్యే ఉన్నాయి. ఒకరోజు రాజదర్బారులోనికి మొగలు రాజదూత కొన్ని వస్త్రాలు తీసుకొచ్చాడు. వాటిని మొగలు చక్రవర్తి పంపారన్నాడు.

మొగలు చక్రవర్తి అధికారాన్ని అంగీకరించేవారు ఈ వస్త్రాలను తప్పకుండా ధరించాలన్నాడు. అహోం రాజు కోపోద్రిక్తుడై ఇలా అన్నాడు.

'దేవేంద్రుని వంశస్థులతో ఇలా మాట్లాడే ధైర్యం మీకెక్కడిది? మేము మీ అత్యాచారాల రాజుకు బానిసలం కాము. ఈ దుష్ప్రవర్తనకు నిన్ను శిక్షించగలము. కాని రాజదూతగా వచ్చావుకాబట్టి ప్రాణదానం చేస్తున్నాం, వెళ్ళిపో, వెళ్ళి మీ చక్రవర్తికి మేము గులాములము కామని చెప్పు. అంతేకాదు. అతన్ని యుద్ధానికి రమ్మని సవాల్ చేస్తున్నాం. అతని 'గొప్పతనమేమిటో యుద్ధరంగంలోనే చూపించమను.''

## రామసింహుని అస్సాం ప్రయాణం

రాజదూత ఢిల్లీ తిరిగొచ్చాడు. విషయమంతా తెలుసుకొని ఔరంగజేబు కోపంతో గంతులేశాడు. గర్విష్ఠులైన అస్సామీలకు గుణపాఠం నేర్పాలనుకున్నాడు.

ఔరంగజేబు పెద్ద కపటి. అప్పుడే వీరశివాజీ ఆగ్రానుండి తప్పించుకుపోయాడు. శివాజీని కావాలనే పారిపో నిచ్చాడని రామసింహమీద ఔరంగజేబుకనుమాన మొచ్చింది. వెంటనే రామసింహను పిలిపించి అస్సాంపై విజయం సాధించేందుకు నేతృత్వం వహించాలని ఆదేశించాడు. అస్సాం వెళ్లాలంటే ఎవరికైనా భయమే. అక్కడ భయంకరమైన మంత్రగాళ్ళు. ఇంద్రజాలి కులుంటారని ప్రతీతి. వాతావరణం మలేరియా జ్వరానికి చాలా అనుకూలంగా ఉంటుంది. అస్సాం వెళ్ళిన వారు క్షేమంగా తిరిగి రావడం చాలా కష్టం. రామసింహ అయితే అస్సాంపై విజయం సాధిస్తాడు లేదా చస్తాడు. ఏదైనా ఔరంగజేబుకానందమే. ఒక కాఫిర్ (ముస్లిమేతరుడు) కు గుణపాఠం అవుతుందనుకున్నాడు. ఒక వేళ అస్సాంపై విజయం సాధిస్తే మూర్ఖులైన అస్సామీలకు గుణపాఠం నేర్పినట్టవుతుందని పథకం వేశాడు.

అస్సాంను జయించాలనే శిక్ష తనకెందుకు విధించబడిందో రామసింహకు తెలుసు. అక్కడికెళ్ళేందుకో షరతు విధించాడతడు. ''జహాపనా! అస్సాం నిండా ఇంద్రజాలికులు, మంత్రగాళ్ళున్నారు. వారినుండి రక్షణ పొందేందుకు సహాయముగా దైవీశక్తులు గల ఒక సాధువును వెంట తీసుకెళ్ళేందుకు అనుమతించండి'' ఔరంగజేబు అనుమతించాడు. సిక్కుల తొమ్మిదవ గురువైన తేగ్‌బహదూర్‌ను తన వెంట పంపాలని ప్రార్థించాడు రామసింహ.

ఔరంగజేబు తేగ్‌బహదూర్ పట్ల కక్ష పెంచుకున్నాడనీ, అతన్నెలాగైనా చంపించదలచుకున్నాడనీ రామసింహకు ముందే తెలుసు. గురుతేగ్ బహదూర్ రామసింహ వెంట వెళ్ళేందుకు ఒప్పుకున్నాడు. రామసింహ అరవైమూడు వేల మంది సైనికులను వెంటదీసుకున్నాడు. అందులో అశ్వదళం,

మందుగుండు దళం వేరుగా ఉన్నాయి. అతడు ఢాకా వెళ్ళి అక్కడి నవాబు సహాయమడిగాడు. నవాబు సంతోషంగా ఒప్పుకున్నాడు. రామసింహుని సేన విశాల సాగరంలా మారింది. అంతా కలిసి మూడు లక్షల సైనికబలం పెంటుంది. విశాల సముద్ర ప్రవాహంలాంటి సేన హిందూ రాజ్యాన్ని జయించాలని బయలుదేరింది.

## లాచిత్ బడ్‌ఫుకన్ ఎంపిక

మరోవైపు అహోం రాజు ఊరికే కూర్చోలేదు. స్వంత వ్యూహంతో ఏకత్రిత సేనలకు సమర్థవంతముగా మార్గదర్శనం చేయగల సేనాపతికోసం వెతుకుతున్నాడు. ఎందుకంటే ప్రస్తుత యుద్ధ సమయంలో బాహుబలం, బుద్ధిబలముతో దండయాత్రను సఫలం చేయగల సమర్థుడిమీదనే భవిష్యత్తు ఆధారపడుతుంది. నీతినిజాయితీలతో సేనలను ముందుకు నడిపించే సేనాపతి కావాలి. ఆ వీరుడు రాజుపట్ల, దేశంపట్ల,

మాతృభూమిపట్ల, విశ్వాసపాత్రుడై, చతురుడై ఉండాలి. బాగా ఆలోచించి లాచిత్‌ను సేనాపతిగా ఎంపిక చేయాలనుకున్నాడు.

## లాచిత్‌కు పరీక్ష

మర్నాడు లాచిత్ దర్బారుకు పిలిపించారు. లాచిత్ రాజుముందు సవినయంగా మోకాళ్ళమీద కూర్చోగానే దర్బారు రక్షకుడొకడు అతని శిరస్త్రాణాన్ని లాక్కొని పారిపోయాడు. లాచిత్ మెరుపులా అతన్ని వెంబడించి సింహాసనం వెనుక పట్టుకున్నాడు. రక్షకుని తలనరికేయడానికి ఉద్యమించిన లాచిత్‌ను రాజు వారించి అసలేం జరిగిందో చెప్పమన్నాడు. లాచిత్ ఇలా విన్నవించాడు.

''నా తలనుండి ఈయన శిరస్త్రాణాన్ని తొలగించాడు. వీరుడైన వాడెవ్వడూ ఈ అవమానాన్ని సహించడు. ఇది ఆత్మాభిమానానికి సంబంధించిన విషయం.'' ఈ పరీక్ష

తన ఆదేశంపైనే జరిగిందని రాజు వివరించి శాంతపరిచాడు.

ఆత్మాభిమానాన్ని ప్రాణంకంటే మిన్నగా కాపాడుకునే వ్యక్తికోసమే వెతుకుతున్నాడప్పుడు రాజు. పరీక్షలలో నెగ్గాడు లాచిత్. అతణ్ణి గౌహతి ప్రధాన సేనాపతి (అస్సామీ భాషలో బడఫుకన్ అంటారు)గా నియమించారు. వెనుకటి పరాజయాన్ని ఇప్పుడు విజయంగా మార్చుకునే అవకాశం లభించిందని భుజాలెగరేశాడు. లాచిత్ గార్‌గావ్ నుండి గౌహతికి ప్రయాణమైనాడు.

లాచిత్ ఇప్పుడు బడ్‌ఫుకన్ అయ్యాడు. మొగలులను దేశం నుండి బయటికి గెంటేస్తానని రాజుకు వాగ్దానం చేశాడు. అహోం సేనలు బ్రహ్మపుత్రా నదిలో బయలుదేరాయి. సైన్యం సూరాయీఘాట్ చేరింది. మార్గమధ్యములో చిన్నా, పెద్ద కోటల్ని, చిన్నచిన్న రాజ్యాలను జయిస్తూ ముందుకు సాగింది. ఇటాఖులీ



పిరికిపందల్లారా! లాచిత్ బ్రతికి ఉన్నంతవరకు గౌహతి మీకు దక్కదు!

(ఇప్పుడు గౌహతి సమీపములో ఉంది) కోటలో మొగలు సర్దారు ఫిరోజ్‌ఖాన్ విడిది చేసుకున్నాడు. వేగుల ద్వారా అతనికీ సమాచారం చేరింది. ఏ క్షణాన్నైనా అహోం సేనలు వచ్చి ఆక్రమించుకోవచ్చునని కూడా చెప్పారు వేగులు. "వస్తే రానీ. మనం గూడా ఒక చూపు చూద్దాం!" అంటూ యుద్ధ సన్నాహాలు ప్రారంభించాడు. లాచిత్ సేనలకు ఫిరంగి దెబ్బలతో స్వాగతం లభించింది. ఇప్పుడేం చెయ్యాలి? ఫిరంగుల నోర్లు మూయించనిదే గెలుపు అసాధ్యం. ఇటాఖుధ్యని హస్తగతం చేసుకోవడం సాధ్యపడదు.

## ఫిరంగులేమైనాయి?

బాగా ఆలోచించి లాచిత్ పకడ్బందీ పథకం తయారుచేశాడు. అదే రోజు తన గూఢచారుల సమావేశమేర్పాటు చేసి పథకం గురించి వివరించాడు. గూఢచారుల్ని దళాలుగా విభజించి వేర్వేరు దిశలలో ఇటాఖులీ వైపు పంపించాడు.

అర్ధరాత్రి తుపాకి గుళ్ళ శబ్దం విని మొగలు సేన గాభరాపడింది. మొగలు సర్దారు తన అనుచరులతో మరోవైపు దౌడుతీశాడు. లాచిత్ గూఢచారుల రెండవదళం అందుకోసమే ఎదురు చూస్తుంది. వెంటనే ఫిరంగుల నోళ్ళను నీళ్ళతో నింపి పారిపోయారు. కోట రక్షకుడు పలాయన మంత్రం పఠించాడు.

తెల్లవారగానే లాచిత్ సేనలు కోటనాక్రమించాయి. శత్రుసేనలు కోటగోడలమీద కన్పించగానే మొగలు సర్దారు నిశ్చేష్టుడయ్యాడు. ఫిరంగులు ప్రయోగించండని గొంతెత్తి అరిచినా ఒక్క ఫిరంగి మోతగూడా వినబడలేదు.

అస్సాం సైనికుల విజృంభణను మొగలు సైనికు లెదురొడ్డలేక చెల్లాచెదరై నాల్గువైపులా పరుగెత్తారు. లాచిత్ సైనికులు వారిని వెన్నంటి తరిమి కోట తలుపులు తెరిచారు. లాచిత్ కోటలో ప్రవేశించగానే జయజయ

ధ్వానాలు మిన్నుముట్టాయి. లాచిత్ బడ్‌ఫుకన్ ఇట్‌ఖులీ కోట విజయవార్తవిని అహోం రాజు ఆనంద భరితుడైనాడు.

తర్వాత మొగలుసేనలు పశ్చిమ అస్సాంలో ప్రవేశించి మొదట దుభరీలో విడిది చేశాయి. గురుతేగ్ బహదూర్ దుభరీలో ఆగి అక్కడొక గురుద్వారా నిర్మించాడు. ఆ గురుద్వారా ఇప్పటికీ ఉంది. రామసింహ ముందుకు సాగి గౌహతికి పదిహేను మైళ్ళ దూరములో విడిదిచేశాడు. అతడు హయగ్రీవ మాధవ మందిరము హాజోలో మరియు కేదార పర్వతాల్లోని కేదారనాథ మందిరములో పూజలు చేసింతర్వాతే యుద్ధ ప్రణాళిక గురించి ఆలోచించాలనుకున్నాడు. అంతలో వర్షఋతువు వచ్చేసింది. అక్కడి కుండపోత వర్షాలు మొగలు సేనల కలవాటులేవు. పెద్ద ఎత్తున మలేరియా వ్యాపించింది. తన తెలివితేటలతో లాచిత్ గౌహతి కోట కాపలాలో

ఉన్నాడు. తన విడిదిని సుకురేశ్వర్ గుట్టవద్దకు మార్చాడు. (ప్రస్తుతమక్కడ పోలీసు అధికారి బంగళా ఉంది) అక్కడనే లాచిత్ తన వ్యూహరచన గావించాడు.

## గూఢచారులపని

యుద్ధములో ఎదుటివారి సేనల గురించి అవగాహన మహత్వపూర్ణమైనది. లాచిత్ చతురతతో తన గూఢచారులను ఫకీర్ల వేషములో శత్రువుల శిబిరంలోకి పంపించాడు. అక్కడ వారు స్వేచ్ఛగా తిరుగుతూ ముఖ్యమైన సమాచారాన్ని సేకరించారు. అంతేకాదు - అహోంరాజు చాలా శక్తిమంతుడు, అతన్ని జయించడం ఎవరికీ సాధ్యంకాదని ప్రచారం చేశారు. అహోంరాజుతో యుద్ధానికి తలపడేవారు పిచ్చివాళ్ళేనన్నారు. మొగలు సైనికులు దానిక్కారణమడిగితే అహోం సైన్యములో చాలా మంది ఇంద్రజాలికులున్నారనీ, ఆ విద్య వారికి కామాఖ్యదేవి ప్రసాదించిందనీ చెప్పారు. అహోం

సైనికుల్లో రాక్షసులున్నారనీ వారు మనుషుల పచ్చిమాంసాన్ని కరకర నమిలి తింటారని కూడా భయపెట్టించారు. మొగలు సైనికులకు పూర్తిగా నమ్మకం కుదరలేదు. అనుమానాలు వ్యక్తం చేశారు. కొందరు మొగలు సైనికులను నావలో ఉత్తరతీరానికితీసుకెళ్ళి చూపించారు. అక్కడ సుమారు యాభై మంది రాక్షస రూపాల్లో మంటల చుట్టూ నాట్యం చేస్తున్నారు. వారి చేతుల్లో నరికిన మనుషుల కాళ్ళు, చేతులు మొదలగు అవయవాలున్నాయి. ఇదంతా లాచిత్ నాటకమని మొగల్ సైనికులకు తెలియదు.

నరికిన అరటి చెట్లను దివిటీలుగా తయారుచేసి నదీ ప్రవాహంలో వదిలేశారు. వాటిని చూడగానే లాచిత్ శిబిరములో పెద్ద ఎత్తున సైనిక సంచాలనముందని మొగలు సైనికులనుకున్నారు. అంతేకాదు - చిన్న చిన్న కట్టెపుల్లలతో చాలా చోట్ల మంటలు పెట్టడంతో లాచిత్

శిబిరములో లక్షల కొద్ది సైనికులు విడిది చేస్తున్నారని మొగలు సైనికాధికారులు భ్రమించారు.

## కూలిపోయిన కోటకు మరమ్మత్తులు

అప్పుడే కోటలో ఒక భాగం కూలిపోయింది. ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా మరమ్మతు చెయ్యాల్సి వచ్చింది. లాచిత్ కోటగోడను పునర్నిర్మించే బాధ్యతను తన చిన్నాన్నకప్పగించి కొందరు సైనికులనిచ్చాడు. అలసిపోయిన సైనికులు లాచిత్ చిన్నాన్నతో విశ్రాంతి కావాలని అడిగారు. ఆయన సైనికులను విశ్రాంతి తీసుకొమ్మని మరోపక్క తాను విశ్రాంతి తీసుకున్నాడు. కాని పూర్తయిందో లేదో చూడాలని లాచిత్ వచ్చాడక్కడికి. సైనికులంతా నిద్రిస్తున్నారు. లాచిత్ కోపం మింటికెగసింది. ముందు తన ఛినన్నాన్నను నిద్రలేపి పని పూర్తికానిదే ఎందుకు నిద్రపోతున్నారని ప్రశ్నించాడు. చిన్నాన్న నీళ్ళు నమిలాడు. అతని

నోటినుండి మాటరాక ముందే లాచిత్ తన ఖడ్గంతో అతని తల నరికేశాడు. ''నా చిన్నాన్న నా దేశం కంటే గొప్పవాడు కాదు'' అన్నాడు. లాచిత్ రుద్రమూర్తి సైనికులను హడలెత్తించింది. వెంటనే పని ప్రారంభించి సూర్యోదయంలోగా గోడను పునర్ని ర్మించారు. నిన్న సాయంత్రం పడగొట్టిన గోడ ఉదయమే తిరిగి సంపూర్ణంగా కనిపించి మొగలు సైనికుల నాశ్చర్యపరచింది.

తన కోటలన్నిటిమీదా లాచిత్ దృష్టి ఉంది. వాటి రక్షణకు కావాల్సిన ఏర్పాట్లన్నీ చేశాడు. ఐనా రంగమటీ కోట చేజారింది. ఇదెలా జరిగిందని లాచిత్ ఆశ్చర్యపోయాడు. దానికి సంబంధించిన వారందరినీ పిలిచి విచారించాడు. రామసింహ అక్కడొక పాచిక విసిరాడు. యుద్ధక్షేత్రములో సైనికులొకరి ముఖాలొకరికి కనబడకుండా పొగలేపాడు. ఆ స్థితిలో ఎక్కడేం

జరుగుతుందో తెలియలేదు. అప్పుడే వందల కొలది కుక్కల్ని ఉసిగొలిపారు. బాగా బలిసిన కుక్కలు అహోం సైనికుల మీద విరుచుకుపడగా ఉరుకులు పరుగులు లంకించుకున్నారు. మిగిలిన కొద్ది సైన్యం ఇటఖలీ కోటవైపు పరుగెత్తింది.

లాచిత్ తన సర్దార్లందరినీ ఒక్కచోట చేర్చి రామసింహను ఓడించే ఉపాయాల గురించి చర్చించాడు. ఏదో విధంగా రామసింహ సరాయిఘాట్ వరకు వచ్చేలా చేయాలని నిర్ణయించారు. ఎందుకంటే అక్కడ అస్సాం సైనికుల నోడించడం ఎవరితరమూ కాదు.

## సవాలు - జవాబు

రోజులు గడుస్తున్నాయి. నెలలు గడుస్తున్నాయి. శక్తినంతా ప్రయోగించి ప్రయత్నించినా రామసింహ గౌహతి చేరలేకపోయాడు. అప్పుడు దుష్టప్రణాళిక వేశాడు. తన రాజదూత ద్వారా లాచిత్‌కో లేఖ



నా చిన్నాన్న దేశం కంటే గొప్ప కాదు!

పంపించాడు. వెంట ఒక సంచినిండా గసాలు నింపి పంపాడు. లేఖ సారాంశమిది-

''ఓ బడ్‌ఫుకన్! నీవో వీరుడివైతే మైదానంలో కొచ్చి ఎందుకు పోరాడవు? కోట వెనుక ఎందుకు దాక్కున్నావు? గుర్తుంచుకో - ఈ సంచిలో ఎన్ని గసాలున్నాయో నా సేనలో అంత మందున్నారు. కొద్దికాలంలోనే మేము మీ అంతు చూడగలము, కాబట్టి గౌహతి మా కప్పగించు. సైనికుల ప్రాణాలు కాపాడుకోవాలంటే మమ్మల్ని శరణువేడుకో''

''ఓ రాజపుత్ర సేనాపతీ! నేను నీకు భయపడను. నన్ను మైదానంలో కొచ్చి యుద్ధం చెయ్యమని అడిగేందుకే ఇంత దూరమొచ్చావా? నువ్వు యుద్ధం చెయ్య దలుచుకుంటే దక్షిణాదిలో శివాజీతోనే చేసేవాడివిగదా! ఇహ సైన్యం సంగతా! మీసేన గసాలలాగ లెక్కలేనంత ఉంటే మా సేన ఆ గసాల సేనను నూరి ఈ గిన్నెలోని

గసాల లేహ్యంలా మార్చేస్తుంది. ఈ వెదురు బొంగులో ఎన్ని ఇసుక రేణువున్నాయో నా వద్ద అంతమంది సైనికులున్నారు. వారిని నూరడం నీ తరముకాదు.

## లంచమివ్వాలనే ప్రయత్నం

రామసింహ లాచిత్‌కు నాల్గు లక్షల రూపాయల లంచమిస్తానన్నాడు. ప్రతిగా పైపైన యుద్ధం చేసి గౌహతిని తన కప్పగించమన్నాడు. ఆ ప్రస్తావనను నిర్దాక్షిణ్యంగా తన్నేశాడు లాచిత్. అప్పుడు రామసింహ నికృష్టమైన పన్నాగం పన్నాడు.

అహోం రాజదర్బారులో పనిచేస్తున్న పేలాన్ ఫుకన్ అనే ఒక అధికారిని కొనేశాడు. అంతకుముందే ఆ అధికారికి లాచిత్ మీద ఈర్ష్య ఉంది. రామసింహ లాచిత్ పేర ఉత్తరం రాసి అది పేలాన్ ఫుకన్ చేతిలో పడేట్టు పథకం తయారైంది. అందులో ఇలా రాసుంది.

''ఓ. బడ్‌ఫుకన్! యుద్ధం ఆపేందుకు నీవడిగిన లక్ష రూపాయలిప్పటికే ముట్టజెప్పానుగదా! ఐనా కూడా నీవు యుద్ధమాపలేదు. ఎందుకు?''

అప్పటికే లాచిత్ శత్రువులను తుదముట్టించడములో ఆలస్యం చేస్తున్నాడని అహోం రాజుకు సందేహం కలిగింది. కాని లాచిత్‌కు తన సేనల పరిమితి తెలుసు. గెరిల్లా యుద్ధం చెయ్యడం మంచిది. మైదానంలో శత్రువుల నెదుర్కోవడం కష్టం. అహోం ప్రధానమంత్రి అతన్ బడగోహాయకి ఇదంతా తెలుసు. అతడు రాజుకీ విషయాన్నీ సవివరంగా వివరించి తొందరపడక సావధానచిత్తులై ఉండాలన్నాడు.

## లాచిత్‌పై సందేహం

అదే సమయములో షేలాన్ ఫుకన్ ఉత్తరాన్ని రాజుకందించాడు. ఉత్తరం చదివి రాజు కోపోద్రిక్తుడైనాడు. వెంటనే లాచిత్‌ను పిలిపించి వివరణ

కోరుతానన్నాడు. కాని అతన్ బడగోహాయ ఆ విషయాన్ని ఖండించి లాచిత్ నిజాయితీని, అచంచలమైన దేశభక్తిని శంకించ జాలమన్నాడు. ఇదొక కుట్ర కావచ్చున్నాడు. రాజు లాచిత్‌కో ఉత్తరం వ్రాశాడు. అందులో ఇలా ఉంది.

''ఓ బడ్‌ఫుకన్! గౌహతి శత్రువులను పారదోలేందుకు నిన్ను పంపించాను. ఈ పని ఇంకా ఎందుకు పూర్తి కాలేదు? మొగలులతో యుద్ధం చేసేందుకు భయపడుతున్నావా? సాధ్యమైనంత త్వరగా శత్రునాశనం కావించు. లేదా ఆడవాళ్ళలా ఒడ్డాణం ధరించి ఆత్మహత్య చేసుకొమ్మని నిన్ను ప్రత్యేకంగా ఆదేశిస్తున్నాను''.

## లాచిత్ సైనిక విజృంభణ

లాచిత్‌ను ఉత్తరమెంతో కలవరపెట్టింది, కాని రాజుగారి ప్రత్యేక ఆదేశానికి కారణమతనికి తెలియదు. జవాబు కూడా ఇవ్వలేదు. విజయమో వీరమరణమో

తేల్చుకోవాలి. సాహసించి ఇరవైవేల మంది యోధుల నెంపిక చేసుకుని వారిని రెండు భాగాలుగా విభజించాడు. ముందు నిల్చుండి యుద్ధం చేసేందుకు కేవలం ఐదువేల మంది సైనికుల్ని మాత్రమే నియమించాడు. ఇంత కొద్ది సైన్యాన్ని అవలీలగా ఓడించగలమనుకుంది మొగలు సైన్యం. యుద్ధం మధ్యలో నలువైపుల నుండి పెద్ద సంఖ్యలో సైనికులొచ్చి పడతారనుకోలేదు. మొగలు సైన్యం వెనుకంజలో ఉండగా అశ్వదళాన్ని రంగంలోకి దింపాడు లాచిత్. అశ్వదళంలో రాజపుత్రులకు, కాల్బలంలో అస్సామీలకు ఎవరూ సాటిరాలేరు. గౌహతి సమీపంలోని అలాబోయి వద్ద భీకర యుద్ధం జరిగింది. నిరంతర పోరాటంతో అలసిపోయిన లాచిత్ సేనలు ఓటమి నెదిరించాల్సి వచ్చింది. పదివేల మంది యోధులు మరణించగా ఎంతో మంది వీరులు గాయాలతో బాధపడుతున్నారు. తన అశ్వదళాన్ని చూచి

రామసింహ సంతోషంతో కేరింతలు కొట్టాడు. సురరాజుగాడా ఓడించజాలని తన సైన్యం ముందు అస్సామీ సైన్యమొక లెక్కా- అని నవ్వేశాడు.

విశ్రాంతి ఎరుగని లాచిత్ శిబిరములో శోకఛాయలు వ్యాపించాయి. యోధులైన సైనికులెందరినో పోగొట్టుకొన్న లాచిత్ దుఃఖించాడు. గుండెలు పగిలేలా అరుస్తూ ఇలాగన్నాడు.

''దుఃఖ సముద్రం నామీద విరుచుకుపడనీ. రాజాజ్ఞ పాలించేందుకు నా దేశానికి మూల స్తంభాలైన పదివేల సైనికులను మృత్యుముఖంలోకైనా పంపుతాను గాని విశ్రమించేదిలేదు''

కొత్త శక్తి ప్రవేశించిందతన్లో. లేచి ఉత్సాహంతో ముందుకురికాడు. సైనికాధికారుల శిబిరమేర్పాటైంది. గౌహతి రక్షణకై శరీరంలోని చివరి రక్తపు బిందువుల్ని కూడా సమర్పిస్తామని కలిసికట్టుగా ప్రమాణం చేశారు.

## గౌహతి దూరంలోనే ఉంది

రామసింహ అలాబోయి మీద విజయం సాధించాడు. గౌహతి ఇప్పుడు కూడా ఢిల్లీ ఉన్నంత దూరంలో ఉంది. లక్ష ప్రయత్నాల తర్వాత కూడా లాచిత్ స్వేచ్ఛా వాయువుల నడ్డగించలేకపోయాడు. ఎప్పట్లాగే గౌహతి అజేయమై నిలిచింది.

యుద్ధం ప్రారంభమై నాలుగేళ్ళు గడిచాయి. రాజా చక్రధ్వజసింహ అనారోగ్యంతో కన్నుమూశాడు. ఉదయాదిత్య సింహాసనమధిష్టించాడు. ఈ సమాచారం తెలిసి లాచిత్ ఎంతో బాధకు గురయ్యాడు. రాజు బ్రతికున్నరోజులలో తన మాటను నిలబెట్టుకోలేక పోయినందుకు తనను తాను నిందించుకున్నాడు.

ధేబారాబార్బోరా అనే వ్యక్తి ప్రభావం కొత్త రాజుపై అధికముగా ఉండేది. ప్రజలను కష్టాలపాలు చేయసాగాడతడు. ప్రతిష్ఠిత వ్యక్తులను గూడా కష్టాల్లో

ముంచెత్తాడు. రాజధానికి తిరిగి వచ్చి తమ కష్టాలు తీర్చమని బాధితులంతా లాచిత్‌కు ఉత్తరాలు రాశారు. ఎట్టి పరిస్థితుల్లోనూ తాను గౌహతిని వదల్లేనని లాచిత్ జవాబిచ్చాడు. లాచిత్ కుటుంబసభ్యులు గూడా ధేబారా బార్బోరా నుండి అవమానాలెదుర్కొన్నారు. ఏ శక్తి కూడా లాచిత్‌ను కర్తవ్యం నుండి మరలించలేకపోయింది.

నిరంతర శారీరక పరిశ్రమ వల్ల లాచిత్ ఆరోగ్యం చెడిపోయింది. జ్వరంతో ఒళ్లు కాలిపోతోంది. రామసింహకీ విషయం తెలియగానే సువర్ణావకాశం దొరికిందని ఎగిరి గంతేశాడు. చివరి ప్రయత్నమొకటి చేసి గౌహతిని చేజిక్కించుకోవాలనుకున్నాడు. యుద్ధ నౌకల్లో సైన్యాలను నింపి గౌహతివైపు నడిపించాడు.

## రోగి బడ్‌ఫుకన్ యుద్ధ నౌకలో

జ్వరంతో బాధపడుతున్న లాచిత్‌కీ విషయం తెలిసింది. దీనిని అస్సాం చరిత్ర పుస్తకాలలో ''అఖోమీ

ఫుటాజ్వర్'' అంటే ఒంటిమీద ధాన్యపు గింజలు వేస్తే పేలాలు (మురమరాలు)గా పొంగుతాయంటారు. ఈ పరిస్థితిలో గూడా లాచిత్ తన నివాసాన్ని మొండి పట్టుదలతో యుద్ధనౌకలోకి మార్చుకున్నాడు. లెక్కలేనన్ని మొగలు నౌకలు గౌహతి వైపు వెళ్ళడం అతని కంటబడింది. ఏమాత్రం ఆలస్యం చేయక తన కాల్బలాన్ని యుద్ధరంగంలో తయారుండాలని ఆదేశించాడు.

దండయాత్రకు బయలుదేరే ముందు పురోహితులచే ముహూర్తం పెట్టించే ఆచారముండేదప్పుడు. పురోహితులా సమయం యుద్ధానికి అనుకూలంగా లేదన్నారు. కొద్ది సేపట్లో మొగల్ సైన్యం సరాయీఘాట్ చేరబోతుంది. అది చూచి అరిచాడు-

''ఓ దేబోధాయీ! నీకారణంగా నేనోడిపోతున్నాను. నువ్వు నన్ను అవమానాల పాల్జేశావుగదూ!''

పురోహితులు కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉండి ఆ తర్వాత తలలాడిస్తూ ఇలా పలికారు.

"ఓ బడ్‌ఫుకన్! నువ్విప్పుడు దండయాత్రకు బయలుదేరవచ్చు. ఎందుకంటే ఈ ముహూర్తంలోనే శ్రీరామచంద్రుడు లంకమీద దండయాత్రచేశాడు"

ఆ రోజు 1674 విజయదశమి.

బడఫుకన్ యుద్ధానికి బయలుదేరాలని ఆదేశా లిచ్చాడు. అప్పటికి మొగల్ సైనికుల భీకర యుద్ధం ముందు అహోం సైన్యం నిలదొక్కుకోలేక పోయింది. సైనికుల్లో కోలాహలం చెలరేగింది. వారు తమ ప్రాణాలు రక్షించుకునేందుకు నదిలో దూకసాగారు.

లాచిత్ యుద్ధనౌక పరిస్థితి గూడా అంతే. నౌకను నడిపేవాడు వెనక్కు నడిపిస్తున్నాడు. ఇదంతా లాచిత్‌కు కంపరమెత్తించింది. కళ్ళు అగ్నిగోళాలైనాయి. కోపంతో

ఊగిపోతూ నౌకలో ఉపద్రవం సృష్టిస్తున్న మూకను బ్రహ్మపుత్రా నదిలోనికి నెట్టేశాడు. యుద్ధనౌకలో లాచిత్ ఒంటరివాడయ్యాడు. మొగలుల యుద్ధనౌకలున్నవైపే ప్రవాహ వేగముంది. అతని నౌక అటువైపే పరుగులు తీస్తోంది. అపారమైన ఆయుధాలతో సైనికులతో నిండియున్న మొగల్ యుద్ధనౌకలవైపు వీరాభిమన్యుడిలా ఒంటరిగా ప్రయాణిస్తున్న వీరశిఖామణి నౌకాదృశ్యం ఎవరినైనా రోమాంచితం చేస్తుంది. జ్వరంతో తూలుతూ ఒంటరిగా నిల్చున్న లాచిత్ గొంతెత్తి అరిచాడు.

''పిరికి పందల్లారా! వెంటనే పారిపోండి. మీరు సుఖంగా జీవించండి కాని లాచిత్ బొందిలో ప్రాణాలున్నంత కాలం గౌహతిని ఎవ్వరూ లాక్కోలేరని మీ (స్వర్గవాసంలోని) రాజుతో తప్పకచెప్పండి''.

ఇది విన్న అస్సాం సైనికుల్లో నూతనోత్తేజం పొంగింది. ఉత్సాహం ఉరకలు వేసింది. తిరిగి యుద్ధ నౌకల్తో

తయారయ్యారు. నదిలో యుద్ధనౌకలు నాయకుని మార్గదర్శనంలో ఎదురు లేకుండా పయనిస్తున్నాయి. వారిధాటికి భయపడి మొగలు సైనికులు పారిపోయేందుకు దారులు వెతికారు. కాని లాచిత్ యుద్ధనౌకలు బ్రహ్మపుత్రానదికి ఆనకట్ట వేసినట్టుగా నిల్చున్నాయి. ఈ ఒడ్డు నుండి ఆ ఒడ్డుకు వాటిమీద నుండి నడచి అవలీలగా చేరుకోవచ్చు. అవకాశం దొరికిందని మొగల్ సైనికులు ప్రాణాలరచేతిలో పట్టుకొని పారిపోవనారంభించారు. అస్సాం సేనలు విజయోత్సాహంతో వారిని వెంబడించి మరీ వేగంగా పరుగెత్తించాయి. మొగలు సేనలను మహానది దాటేదాకా వెంబడించారు. అప్పుడు మహానది అస్సాం సరిహద్దుగా ఉండేది.

## అమరజీవి లాచిత్ బడ్‌ఫుకన్

విజయలక్ష్మితో తిరిగి వెళ్ళానను కున్న రామసింహ పగిలిన గుండెల్తో ఢిల్లీ చేరాడు. అతడిలా అనుకున్నాడు.

''ఈ భూమ్మీద పరమేశ్వరుని అనుకంప, ఛాయలున్నాయి. అస్సాం భూమిని జయించాలను కోవడమే మూర్ఖత్వము. అక్కడి ప్రతి సైనికుడు ఖడ్గధారి, ధనుర్ధరుడు, గజ ఈతగాడు, సామాన్య మానవుల్లో అసామాన్యుడు. ఆ కష్టజీవి దేశభక్తుడు. దేశం కోసం సర్వస్వాన్ని సమర్పిస్తాడు. విదేశీ దురాక్రమణదారుల దుష్టమైన కోరికలచట సఫలం కాజాలవు''

లాచిత్ విజయకేతనమెగరేసి గుండెల నిండా ఊపిరి పీల్చుకున్నాడు. కాని కొద్దిసేపటిలోనే అంతిమశ్వాస పీల్చి వీరస్వర్గమలంకరించాడు. అతని మరణదినం గురించి

చరిత్ర మౌనం వహించింది. అస్సాంలోని ప్రతి ఇంటిలో లాచిత్ యశోగానం చేస్తారు. అతని వీరత్వాన్ని ధైర్య సాహసాలను, యుద్ధ కళను, దేశభక్తిని వేనోళ్ళ పొగడుతారు.

ఈ దేశములో స్వాతంత్ర్యంపట్ల ఎప్పటివరకైతే ప్రేమ ఉంటుందో అప్పటి వరకు లాచిత్ బడ్‌ఫుకన్ లాంటి వీరవరులు ప్రజల హృదయాల్లో నిలుస్తారు.

